ఆయన, తన భార్య అనసూయని చూపిస్తూ 'అమ్మాయీ! ఈమె అనసూయ. పూర్వం 10 ఏండ్లు కఱువు రాగా ఈమె పళ్లనీ, గంగాజలాన్నీ సృష్టించడమే కాక 10 రాత్రులను ఒకే రాత్రికి కుదించింది. (దశవర్షాణ్యనావృష్ట్యా దగ్ధే లోకే నిరంతరం యయా మూలఫలే సృష్టే జాహ్నవీ చ ప్రవర్తితా - దశరాత్రం కృత్వారాత్రిః సేయం మాతేవ తేఽనఘ - అనసూయేతి యాలోకే కర్మభిః ఖ్యాతిమాగతా.) అని ఇంకా ఆమె గొప్పదనాన్ని చెప్పాడు. పండుముసలి, తలనెరిసిన వృద్ధ తపస్విని, నిండుప్రేమతో కళ్లు పెద్దవిచేసి చూస్తూ 'అమ్మాయీ ! నా ఒడిలోకూచో' అంది. సీత సంతోషంతో కూచున్నాక 'నీ పెళ్లి స్వయం వరంలో అయిందటగా ! ఆ కథ మొత్తం చెప్పవే ! వినాలని ఉంది' అంది. (తాం కథాం శ్రోతు మిచ్ఛామి విస్తరేణ చ మైథిలి!) ఎప్పుడూ వాడని పూమాలిక, అంగరాగం (మైపూత), ఒక చీర, ఆభరణాలు కొన్ని అనసూయ సీతకిచ్చింది. సీత తన స్వయంవరకథ మొత్తం చెప్పాక ఆమె, సీతని దగ్గఱకు తీసికొని ఆశీర్వదించింది. (ఇదం దివ్యం వరంమాల్యం వస్త్రమాభరణాని చ అంగరాగం చ వైదేహి మహార్హ్యంచానులేపనమ్).

## లో రహస్యం

ఆయన పేరు అత్రి. సత్త్వ-రజస్ - తమస్ అనే గుణాలు మూడు. ఆ మూటికీ అతీతుడు అ-త్రిమహర్షి. (ఆరాత్రిరత్రిః సా రాత్రిః యాం నాధీతే త్రిరద్య వై ఆరాత్రి రత్రి రిత్యేవ నామ మే విద్ధి శోభనే !) అర (పాపం) నుండి త్ర (రక్షించేవాడు)'అత్రి'.వేదాధ్యయనంచేయనిరాత్రిఅనేది జీవితంలోనే లేని ఆయన, రాత్రి. (అత్తీతి అదఃతస్మాత్త్రాయతే)మృత్యువునుండిరక్షించగలవాడుకాబట్టి కూడా ఈయన అత్రి అయ్యాడట. ఇక ఆమె అసూయలేనిది అనసూయ. మంచిలో చెడుని కావాలని చూపదలచడం అసూయ. లోకమంతా సుఖంగా ఉండాలనే దృక్పథం తోనూ, అందఱూ నాకంటె ఆనందంగా ఉండాలనే భావంతోనూ ఉండడం అనసూయ విధానం. ఆ కారణం చేతనే ఆమె కఱువు వచ్చినప్పుడు అంతగా శ్రమించి సహాయపడింది. కష్టంవచ్చి సీతారామలక్ష్మణులు అడవికి పోతూంటే స్వయంవర కథని అడగడంలో చాల విశేషం ఉంది. ఆ సీత, కూడ ఈ ప్రశ్నలోని లోభావం గమనించి స్వయంవర కథని మొత్తాన్ని చెప్పింది.

సీతమ్మ కూడా సాధారణ స్త్రీలాగా - "ఎలా జరిగితే ఏం ప్రయోజనం ? వనవాసానికి పోతున్నాం గదా ! ఈ భర్తవలన ఇలాంటి కష్టాలని...."వంటివిధంగా

పల్కుతుందా ? లేక ఎవరూ ఎక్కుపెట్టలేని విల్లుని విరిచిన లోకోత్తర పురుష నిగా అతనిని భావిస్తోందా ? వనవాసానికి దుఃఖిస్తోందా ? లేక భర్తతోనే వనవాసం కాబట్టి ఆనందంగా ఉందా ? తాను అయోనిజ కాబట్టి ఈ కష్టాలు, కష్టాలు కానే కావని తలుస్తోందా ? లేక సాధారణస్త్రీలాగా ' నా జీవితం అంతా కష్టాలే! ' అని తోటి స్త్రీతో చెప్పుకుంటుందా ? వంటివి గమనించాలని ఈ ప్రశ్న వేసింది. సీతమ్మ సమాధానం చెప్పడమే కాకుండా, అనసూయతో మరో రెండు విశేషాలుచెప్పిరాబోయే కధని కూడ సూచించింది సీతమ్మ.

అనసూయాదేవీ ! స్త్రీలు ఎలా ఉండాలి ? అనే విషయాన్ని మా అత్తకౌసల్య నాకెప్పుడో చాల చక్కగా ఉపదేశించింది. నా భర్త స్వయంవరంలో విల్లుని ఎక్కుపెట్టమంటే అంతకంటె గొప్పగా విల్లుని విరిచి (ఇందులో రహస్యం నా బాలకాండ వ్యాఖ్యలో చూడవచ్చు) నన్ను వివాహం చేసికొనే 'అర్హతని సంపాదిం చాడు. అయినా తన తండ్రి, అంటే నామామగారి అంగీకారం లేనిదే చేసికోనని పల్కాడు సుమా !' అని ముగించింది. ఈ రెంటి వల్ల తెలిసేవి 1) "పతివ్రతా ! ఎంత కష్టం వచ్చినా భర్తవెంటే ఉంటాను. రాముడు కష్టపడుతూంటే అతని తల్లి కౌసల్య దుఃఖిస్తుంది ఆ దుఃఖాన్ని ఆమె పొందకుండా ఉండేందుకై ఆమె చేసిన ఉపదేశాన్ని పాటిస్తాను. (అత్త మాట వింటాను). 2) నా భర్త రామునికి తన తండ్రి మాట మీద ఉన్న గౌరవం నామీది కంటె ఎక్కువదని గ్రహించాను. అందుకని ఈ కష్టాలకి కారణం ఒకవేళ నా మామ దశరథుడే ఐనా, నా భర్తకిఉన్న ఇష్ట గౌరవాలని బట్టి, ఆయనని తక్కువచేసి ఎప్పుడూ మాట్లాడను "అని సీతమ్మ తనలో ఆలోచించుకుని పల్కినట్లు తెలుస్తుంది.

ఇలాటి పురాణేతిహాసాలని చదివితే, సంసారాలలో ఐకమత్య భావం పెరిగి వసుధైక కుటుంబకం (ప్రపంచం అంతా ఒక కుటుంబం) అనే భావం కల్గుతుంది. అది దేశానికి కూడా తప్పనిసరి. ఇలాటి ఇతిహాసాలని చదువని లేదా చదివించని పక్షంలో- నేనూ, నా ఇల్లూ .... వంటి 'నేను' తో ప్రారంభమౌతుంది. ఈ 'నేను' శబ్దాన్ని ఎవరూ తట్టుకోలేరు. ముఖ్యంగా, తన సంతానం తనని నిలదీస్తూ 'నేను' .... అంటే, అంతకు మించిన శిక్ష తండ్రికి మరొకటి లేదు.

భారతరామాయణాల కుపోలికకూడకన్పిస్తుంది. ధర్మాన్ని 'ధర్మాన్ని తప్పిరాజ్యం తీసికొనను - అని రాముడంటే అవలంబించి రాజ్యాన్ని ఇవ్వనని దుర్యోధనుడన్నాడు. మాకురాజ్యం వద్దేవద్దనీ, ఎలాగైనా

తీసికోమని భరతుడంటే, మాకు రాజ్యం కావాలనీ, ఎలాగైనా రాజ్యాన్ని ఇవ్వమనీ దుర్యోధనుడన్నాడు. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు శిష్ట చతుష్టయమైతే భారతంలో దుష్టచతుష్టయం ఉన్నారు. రాజ్యాన్ని ఏమైనా స్వీకరించనని రాముడు పలికితే, ఎలాగైనా సరే తిరిగి ఇవ్వనని దుర్యోధనుడన్నాడు. సత్త్వగుణంతో పరిపాలన చేస్తే రాజ్యం కూడా మోక్షదాయకమే అని రాముని ఆలోచనమైతే, రజస్తమో గుణాలతో యుద్ధం చేసి గెలుపొందడమే రాజ్య పద్ధతి సుమా ! అని దుర్యోధనుని నిశ్చితాభిప్రాయం. అన్నమెప్పుతో భరతుడు, రాముని కీర్తిని మొత్తాన్ని పాదుకలని మోసి క్షణకాలంలో సంపాదిస్తే - ధృతరాష్ట్రుని అండతో దుర్యోధనుడు కురువంశ కీర్తి మొత్తాన్ని పాండవరాజ్యాన్ని అపహరించడం ద్వారా ధ్వంసం చేసాడు. విశ్వరూపాన్ని చూచికూడా కృష్ణుణ్ణి మానవునిగానే దుర్యోధనుడు భావిస్తే, మనుష్యుణ్ణని వేలసార్లు చెప్పినా రాముణ్ణి దైవంగానే భావించారు రామాయణసహచరులందరూ.

మంథర అసూయతో అయోధ్యాకాండ మొత్తం ఒక్కసారి అలా ఉప్పెన వచ్చిన సముద్రంలా అల్లకల్లోలమయితే, అనసూయాదర్శనంతో తిరిగి ప్రశాంతతని పొందింది. అంటే అసూయవలన పోయిన ప్రశాంతత, అనసూయ వలన తిరిగి లభించిందని భావం.

సీత సమాధానాలని విని అనసూయాదేవి అనుజ్ఞఈయగా, సీత పరమ సంతోషంతో రాముణ్ణి చేరింది.

ఋషులని రక్షింపవలసిన బాధ్యత తన మీదనే ఉందని గ్రహించినరాముడు, రాక్షసులు ఋషిబాధని చేస్తూ ఉన్న దండకారణ్యం వైపు సీతాలక్ష్మణ సమేతుడై బయలుదేరాడు.

స్వస్తి ప్రజాభ్యః.

(దీని మీదట అరణ్యకాండాన్ని చదవండి.)

ఇతిశమ్

# డాక్టర్ మైలవరపు శ్రీనివాసరావు
## రచనలు

శ్రీ మద్వాల్మీకి రామాయణాయనమ్

i) బాలకాండము (కథ మఱియు అంతరార్థంతో) 20-00

ii) అయోధ్యాకాండము ( ,, ,, ) 35-00

iii) సుందరకాండము ( ,, ,, )
(నిత్య పారాయణానికి వీలుగా) 35-00

మాంగల్యతంతునానేన
(పెళ్లి మంత్రాలకి అర్థమూ+వివరణమూ) 30-00

మొత్తం సెట్టు రిజిష్టర్డ్ పోస్టు చార్జితో కలిపి రూ. 120/-

ముద్రణలో

i) పండుగలు - అంతరార్థమూ - కర్తవ్యమూ

ii) శ్రీ విష్ణు సహస్రనామాలూ - అంతరార్థమూ

iii) శ్రీమద్భాగవతసౌందర్యము (కథమఱియుఅంతరార్థము)

iv) శ్రీమద్వాల్మీకి రామాయణాయనమ్ (ఉత్తరకాండము)